ప్రతిఫలిత చైతన్యము అహం కర్తా అనువృత్తి జ్ఞానము. ఈ అహంతలో తాంత్రిక సమ్మతమైన మరొక విశేషము గమనింపదగినది. అహమ్ లోని అకారము శివవాచకము, హకారము అవిద్యా ప్రతిఫలిత చైతన్యరూపుడైన జీవునకు వాచకము కావున అహమ్ అను స్ఫురణమే శివజీవైక్య విషయకము. **శివోऽహమ్** అను చరమవృత్తియందును శివజీవైక్యమే విషయము. ఇది యంతయు వివరించరాని అహంతయొక్క యథామతి వివరణము. అది అమ్మవారి స్వరూపము. చైతన్యరూపిణియైన అమ్మవారు జంతువుల లోపల, బయటను ఉండును.

2) దీర్ఘకాలిక ఏకవిషయ జ్ఞానము లేక ఏకవిషయ ప్రత్యయముల ప్రవాహము కాని **ధ్యాన** మనబడును. ఆ ధ్యానము లేక ఉపాసనమును చేయు యోగులందు చిరంజీవిత్వ సత్యకామత్వ సత్యసంకల్పత్వాది రూపమహిమను వారి జ్ఞానములందు విషయముగా కూడ నున్న అమ్మవారే అనుగ్రహించుచుండును.

**అవ॥:-** పై శ్లోకమున యోగులకు మహిమలను ప్రసాదించగల మహిత అమ్మవారు అని చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని రంజింపజేయు అమ్మవారి వాఙ్మంజులత వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కలమఞ్జులవాగనుమిత-**
**గలపఞ్జరగతశుకగ్రహౌత్కణ్ఠ్యాత్।**
**అమ్బ! రదనామ్బరం తే**
**బిమ్బఫలం శమ్బరారిణా న్యస్తమ్॥ 99**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| అమ్బ! | = అమ్మా! |
| కలమంజులవాగనుమితగల | = అవ్యక్తమధురమైన అందమైన వాక్కు చేత తెలియబడిన |
| పంజరగతశుకగ్రహౌత్కణ్ఠ్యాత్ | పంజరమందున్న చిలుకను పట్టు తీవ్రవాంఛవలన; |
| తే | = నీయొక్క; |
| రదనామ్బరమ్ | = పెదవియనెడు; |
| బిమ్బఫలమ్ | = దొండపండు; |
| శమ్బరారిణా | = మన్మథునిచేత ; |
| న్యస్తమ్ | = ఉంచబడినది. |

**తాత్పర్యము :-**

అమ్మా! నీ అవ్యక్తమధురమంజుల వాక్కుచేత నీ కంఠమను పంజర మందొక చిలుక యున్నదని దానిని పట్టుకొనుట కెఱగా పెదవియను దొండపండును మన్మథుడు పెట్టినాడు.



**వివరణము :-**

పూర్వార్ధమున వాక్కు అను హేతువుచేత నీ కంఠపంజరము అను పక్షమునందు చిలుక అను సాధ్యము అనుమితమగుచున్నదని చెప్పుటచే ననుమాలంకారమున్నది. ఆ చిలుకను పట్టుకొనుట కామన్మథుడెఱగా పెట్టిన దొండపండేమో యన్నట్లు నీ పెదవి యున్నదని చెప్పుటచే నుత్ప్రేక్షాలంకారము ఉత్తరార్ధమున అనుప్రాసాలంకారములున్నవి.

**అవ॥:-** అమ్మవారి వాక్కులు మధురమంజులములు అని పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి వాక్కులనే తనకు ప్రసాదించిన అమ్మవారికి కృతజ్ఞతతో జయజయ కారమును కవి చేయుచు ఆర్యాశతకమును సమాప్త మొనరించుచున్నాడు.

**శ్లో॥ జయ జయ జగదమ్బ! శివే**
**జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే।**
**జయ జయ మహేశదయితే**
**జయ జయ చిద్గగనకౌముదీధారే॥ 100**

**ప్రతిపదార్థము :-**

| | |
|---|---|
| జగదమ్బ | = ఓ జగజ్జననీ! |
| శివే | = ఓ మంగలస్వరూపురాలా! |
| జయ | = జయింపుము; |
| జయ | = జయింపుము; |
| కామాక్షి! | = ఓ కామాక్షీదేవీ! |
| అద్రిసుతే | = ఓ మంచుకొండ కూతురా; |
| జయ | = జయింపుము; |
| జయ | = జయింపుము; |
| మహేశదయితే | = ఓ మహేశుని దయితా! |
| జయ | = జయింపుము; |
| జయ | = జయింపుము; |
| చిద్గగనకౌముదీధారే | = ఓ చిదాకాశమందలి దట్టమైన వెన్నెల ప్రవాహమా! |
| జయ | = జయింపుము; |
| జయ | = జయింపుము. |

**తాత్పర్యము :-**

ఓ జగజ్జననీ! మంగల స్వరూపిణివైన నీవు మరల మరల జయింపుము. ఓ కామాక్షీ! మంచుకొండ బిడ్డవైన నీవు మరల మరల జయింపుము. మహేశ్వరుని భార్యవైన నీవు మరల మరల జయింపుము. చిద్గగన మందలి దట్టమైన వెన్నెల ప్రవాహమవైన నీవు మరల మరల జయింపుము.

## ఆర్యాశతకమ్ - శ్లోకానుక్రమణికా







# పాదారవిన్దశతకమ్